## శ్రీ ప్లవ నామ సం॥ నాయక ఉపనాయక నిర్ణయః

| | | | | |
|---|---|---|---|---|
| వత్సరారంభం | **రాజ్ఞః** | రాష్ట్రాధిపః | శుభాధిపః | **కుజః** |
| మేష సంక్రమణం | **మంత్రిః** | దేశోద్యోగాధిపః | అశ్వాధిపః | **బుధః** |
| వృషభ సంక్రమణం | | పురోహితః | గజాధిపః | **శుక్రః** |
| మిథున సంక్రమణం | **అర్ఘాధిపః** | పశూనామధిపః | | **కుజః** |
| కర్కాటక సంక్రమణం | **సస్యాధిపః** | దేవాదయాధిపః | | **శుక్ర** |
| సింహ సంక్రమణం | **సేనాధిపః** | పురుషాధిపః | | **చంద్రః** |
| కన్య సంక్రమణం | | పరీక్షకః | గ్రామనాయకః | **గురు** |
| తుల సంక్రమణం | **రసాధిపః** | వస్త్రాధిపః | | **రవిః** |
| వృశ్చిక సంక్రమణం | | గ్రామపాలకః | రత్నాధిపః | **కుజః** |
| ధను స్సంక్రమణం | **ధాన్యాధిపః** | వృక్షాధిపః | | **గురుః** |
| మకర సంక్రమణం | **నీరసాధిపః** | జంగమాధిపః | | **శుక్రః** |
| కుంభ సంక్రమణం | | గణకః | సర్పాధిపః | **రవిః** |
| మీన సంక్రమణం | | దైవజ్ఞః | మృగాధిపః | **చంద్రః** |
| ఆర్ద్రా ప్రవేశం | **మేఘాధిపః** | స్త్రీణామధిపః | | **కుజః** |
| కుంభాయనం | | | వర్షాధిపః | **గురుః** |
| మీనాయనం | | | తటాకాధిపః | **శుక్రః** |

**నాయక, ఉపనాయకులు 32 మందిలో 19 మంది శుభులు, 13 మంది అశుభులు.**

**శుభాధిపత్యం అధికంగా ఉన్నది.**

## దేశఫల నిర్ణయం

**శ్లో॥** కాంభోజ కాశ్మీర కళింగ దేశే రాజ్ఞ ఫలం। బాహ్లిక మాళవేషు మంత్ర్యుద్భవం।
పౌండ్ర విదర్భదేశే సస్యాధినాథస్య ఫలంతు శిష్టం।
చీనాంగ వంగదేశేషు రసాధిఫలం జగుః।
గౌడమాగధ దేశేషు నీరసాధిపతేః ఫలం। **ఆంధ్రదేశేషు** సర్వేషు ఫలమార్ద్రాదిజం భవేత్।
మేషరాశిఫలం మత్స్యే గౌడే శేషంతు సర్వతః।
పురోహితోద్భవం వంగేష్వంగేషు చ పరిక్షకమ్।
కైరాతదేశే గణకాత్ కృకరే గ్రామపాలకమ్।
దైవజ్ఞాద్బర్బరేదేశే కాశ్మీరే మేషసంక్రమాత్॥
**సంవత్సరఫలంశృత్వా** యస్సంవత్సరికోత్తమమ్।
సంతోషయతి తేనైవ తోషితాస్సకలా గ్రహాః॥

## రాజాధి నవనాయక ఫలములు

### రాజ్ఞః కుజస్య ఫలం

**శ్లో॥ భౌమస్య రాజ్యేఽ గ్నిభయం ధరిత్రీ సస్యేనహీనా క్వచిదేవవృష్టిః !**
**చోరాః ప్రభూతా మనుజేశ్వరాణాం స్యాద్విగ్రహోఽ న్యోన్య జయాయనూనం !!**

కుజుడు రాజు అగుట వలన అగ్నిభయములు, శస్త్రభయములు పెరుగుట, చోరులు, దుర్మార్గులు పెరుగుట, పాలకులు అధికార మదముచే ప్రవర్తించుట, సైనిక వర్గం వారికి శ్రమ పెరుగుట, సరిహద్దు ప్రాంతములలో ఇబ్బందులు ఏర్పడుట, కొన్ని చోట్ల వాయుపరమైన ఇబ్బందులు వాటిల్లుట జరుగును.

### నావికా వాహన ఫలం

**శ్లో॥ జనానాం భ్రమితే సర్వే చతుష్పాదాః ప్రపీడితాః !**
**విఫలా సకలాధాత్రీ నౌకావాహన వత్సరే !!**

రాజు నౌకావాహనారూఢుడగుటచే రోగములు ప్రబలుట, పాలకులకు అధికరా పరమైన ఇబ్బందులు ఏర్పడుట, జల సంబంధమైన ప్రమాదములు ఏర్పడుట, సముద్ర నదీ తీర ప్రాంతములందు ప్రమాదములు ఏర్పడుట, ధాన్యాదుల ధరలు పెరుగుట, వ్యాపార లావాదేవీలలో భారీ కుంభకోణములు వచ్చుట జరుగును.

### మంత్రీ బుధస్య ఫలం

**శ్లో॥ శశిసుతే శుభమంత్రి సమాగతే స్వపతినా కురుతే మదనక్రియాం !**
**బహుధనం బహువారి సమన్వితం యవమసూరిచణాన్న మహార్ఘతా !!**

బుధుడు మంత్రి అగుట వలన ప్రేమవ్యవహారములు పెరుగుట, కుటుంబ వైరుధ్యములు పెరుగుట, వ్యాపార వాటాలు, పన్ను శాతం, వెండి ధరలు పెరుగుట, వ్యాపారములు బాగుగా జరుగుట, సామాన్య వర్షములతో మధ్యమస్థాయిలో పంటలు ఏర్పడుట, స్త్రీలకు మంచిగుర్తింపులు వచ్చుట జరుగును.

### సేనాధిపతేః చంద్రస్య ఫలం

**శ్లో॥ అతీవార్ఘశ్చాతివర్షం అరోగా స్సుఖినో జనాః !**
**బహుక్షీరప్రదాగావః చంద్రే సైన్యాధిపే సతి !!**

చంద్రుడు సేనాధిపతి (రక్షణశాఖకు) అధిపతి అగుటవలన సైనిక వర్గం అధికారులు ఒత్తిడి పెరుగుట, పశుసంపద వృద్ధిచెందుట,జలపరమైన ఇబ్బందులు ఏర్పడుట, వెన్న, నెయ్యి, నూలు, వస్త్రములు, బియ్యం ధరలు పెరుగుట జరుగును.

### సస్యాధిపతేః శుక్రః ఫలం

**శ్లో॥ శుక్రసస్యాధిపత్యేన ఫలితా ధాన్యజాతయః !**
**పాండుభూమి స్సుఫలితా సర్వత్రారోగ్య సంపదః !!**

శుక్రుడు (పూర్వ) సస్యాధిపతి అగుట వలన అన్నిధాన్యములు బాగుగా పండుట, తెల్లని భూములు, తెల్లనిధాన్యములు బాగుగా ఫలించును, క్షేమారోగ్యములు కలుగుట, వైద్యులకు, స్త్రీలకు మంచి గుర్తింపులు వచ్చుట జరుగును.

## ధాన్యాధిపతేః గురోః ఫలం

**శ్లో॥ సువృష్టి స్సర్వదేశేషు సర్వ సస్య సమృద్ధయః !**
**భవంతి గావ స్సుదుఘాః గురౌ ధాన్యాధిపే సతి !!**

గురువు (అపర) ధాన్యాధిపతి అగుట వలన దేశమంతటా సానుకూల వర్షములచేత పాడిపంటలు వృద్ధిచెందుట, ఆహార ధాన్యములు వృద్ధిచెందుట జరుగును.

## అర్ఘాధిపతేః కుజస్య ఫలం

**శ్లో॥ అర్ఘాధీశే భౌమే భూపానాం భూరిభీతిదం యుద్ధం !**
**కృషిపణ్య గవాం హానిర్లోహిత ధాన్యార్ఘ వృద్ధిస్యాత్ !!**

కుజుడు అర్ఘాధిపతి అగుట వలన వాయుపూరిత వర్షములు కురియుట, ప్రజారోగ్యపరమైన ఇబ్బందులు కలుగుట, ఎర్రని ధాన్యములు వృద్ధిచెందుట, దౌర్జన్యములు పెరుగుట, వెండి, బంగారం, లోహములకు, వస్త్రములకు, రబ్బర్ కి ధరలు పెరుగుట , రాజకీయ వడిదుడుకులు ఏర్పడుట జరుగును.

## మేఘాధిపతేః కుజస్య ఫలం

**శ్లో॥ అతివాయురనర్ఘశ్చ స్వల్పవృష్టిస్తథాభువి !**
**రక్తసస్యాని జాయన్తే భౌమే మేఘాధిపే సతి !!**

కుజుడు మేఘాధిపతి అగుట వలన వాయుపూరిత వర్షములు కురియుట, ఎర్రని భూములు బాగుగా ఫలించుట, రోగభయములేర్పడుట జరుగును.

## రసాధిపతేః సూర్యస్య ఫలం

**శ్లో॥ ఘృతతైలగుడక్షౌద్రాద్యేచాన్యే రసజాతయః !**
**శూన్యార్ఘం యాంతితే సర్వే రవౌ యది రసాధిపే !!**

సూర్యుడు రసాధిపతి అగుట వలన నెయ్యి, నూనె, బెల్లం, తేనె, చింతపండు, నిమ్మ, నారింజ, మామిడి బంగారం ధరలు పెరుగుట జరుగును.

## నీరసాధిపతేః శుక్రస్య ఫలం

**శ్లో॥ కర్పూరాగరు గంధానాం హేమ మౌక్తిక వాససాం !**
**వృద్ధయోఽర్ఘేణ జాయన్తే శుక్రే నీరసనాయకే !!**

శుక్రుడు నీరసాధిపతి అగుట వలన కర్పూరం, అగరు, గంధం, బంగారం, ముత్యములు, రత్నములు, వస్త్రములు, ఆభరణములు, సౌఖ్య వస్తువులకు, గృహోపకరణములకుధరలు పెరుగుట జరుగును.

## దైవజ్ఞః చంద్రస్య ఫలం

**శ్లో॥ జలధాన్య సమృద్ధిస్యాత్ ఫలితా వృక్షజాతయః !**
**నానాధాన్య సమృద్ధిస్యాత్ దైవజ్ఞే నిశినాయకే !!**

చంద్రుడు దైవజ్ఞుడు అగుట వలన దైవజ్ఞులు అధికారములకై ప్రాకులాడుట, జలము, ధాన్యములు బాగుగా ఉండుట, ఫలపుష్పాదులు బాగుగా ఫలించుట జరుగును.

## పశుపాలకః గోష్టప్రాపకః గోష్ట బహిష్కర్తా యమః - తత్ఫలం

**శ్లో॥ అనర్ఘశ్చాల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథాగవాం !**
**పశుపీడా భవేన్నిత్యం యమే పశ్వధిపతే భవేత్ !!**

పశుపాలక, గోష్టప్రాపక,గోష్టబహిష్కర్తాధిపత్యములు యమునికి వచ్చుట వలన స్వదేశీ పశుసంపదకు అనారోగ్యములు వాటిల్లుట, విదేశీ పశుసంపదలకు గిరాకీ అధికమగుట, దుర్మార్గుల వలన ఇబ్బందులు పెరుగుట జరుగును.

## ఆఢక నిర్ణయము

**శ్లో॥ షష్టియోజనవిస్తీర్ణం శతయోజనమున్నతం !**
**ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే !!**
**విభాగం ః- శ్లో॥ నవభాగా స్సముద్రేషు పర్వతేషు తథానవ !!**
**ద్వౌభాగౌ భువి పర్జన్య శ్చైవం వర్షతి చ త్రిథ !!**

దేవమానముచే కొలుచు పాత్ర 60 యోజనముల విస్తీర్ణం, 100 యోజనముల ఎత్తు కలిగి 9 భాగములు సముద్రమందు, 9 భాగములు పర్వతములయందు, 2భాగములు భూమి యందు వర్షం కురుయుట జరుగును.

**2 తూముల వర్షం, 3 తూముల గాలి, 8 వీసముల పంట కలుగును.**

## వాస్తుకర్తరి నిర్ణయము

దివి. 04-05-21 చైత్ర బ॥౮ మంగళవారం మ. 03-14ని. లకు వాస్తు కర్తరి ప్రారంభం.
దివి. 28-05-21 వైశాఖ బ॥౨ తత్కాల బ॥౩ శుక్రవారం రా. 08-08ని. లకు వాస్తుకర్తరి సమాప్తం.

## శుక్ర మౌఢ్య నిర్ణయం

శార్వరి సంవత్సర మాఘ శు॥౨ తత్కాల శు॥౩ శనివారం దివి. 13-02-21 న రా. 01-21 ని. లకు ప్రాగస్తమిత శుక్రమౌఢ్యమి ప్రారంభం.
ప్లవ సంవత్సర చైత్ర బ॥౮ మంగళవారం దివి. 04-05-21 న ఉ. 06-54ని. లకు పశ్చాదుదయ శుక్రమౌఢ్యమి సమాప్తం.
పౌష శు॥౨ మంగళవారం దివి. 04-01-22 న ఉ. 07-26 ని. లకు పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యమి ప్రారంభం.
పౌష శు॥౧౨ గురువారం దివి. 13-01-22 న రా. తె. 05-14ని. లకు ప్రాగుదయ శుక్రమౌఢ్యమి సమాప్తం.

## గురు మౌఢ్య నిర్ణయం

మాఘ బ॥౩ శనివారం దివి. 19-02-22 న ఉ. 10-08 ని. లకు పశ్చాదస్తమిత గురుమౌఢ్యమి ప్రారంభం.
ఫాల్గుణ బ॥౨ ఆదివారం దివి. 20-03-22 న ఉ. 08-29 ని. లకు ప్రాగుదయ గురుమౌఢ్యమి సమాప్తం.

**పై మౌఢ్యములయందు శుభకార్యక్రమములు వర్జనీయము. కావున చేయకూడదు.**

## పుష్కర నిర్ణయం

కార్తీక బ॥౧ తత్కాల బ॥౨ శనివారం దివి. 20-11-21 న రా. 11-28-06 సె॥లకు గురువు కుంభ రాశిలో ప్రవేశిస్తున్నాడు. దివి. 21-11-21 ఆదివారం నుండి శ్రీసార్ధత్రికోటి తీర్థరాజ సహిత **సింధూ నదికి** పుష్కర ప్రారంభము జరుగును.

## తమో నామాకో మేఘః - తత్ఫలం

**శ్లో॥ రోగాధిక్యం జాయతే నీరశేషశ్చోరాధిక్యం నైవ ధాన్యస్య పోషః !**
**యస్మిన్ వర్షేస్యాత్తమో నామ మేఘః తస్మిన్ దుఃఖం ప్రాప్నుయాల్లోకసంఘః !!**

తమో మేఘము వలన పశ్చిమ ప్రాంతములో రోగములు ప్రబలుట, వర్షములు తగ్గుట, వ్యాపారాలలో మోసములు పెరుగుట, చోరభయములు అధికమగుట జరుగును.

**శ్లో॥ భూమింవహేతు విరాటేతు భూమి స్వస్థా సుభిక్షకృత్ !**
**ప్రజానాం సుఖమారోగ్యం సువృష్టి స్సర్వ దిక్షుచ !!**

విరాటుడు భూవాహకుడు అగుట వలన ప్రమాదములు, భయోత్పాతములు మెల్లగా తగ్గి సానుకూలతలు ఏర్పడుట, ఆరోగ్యముతో జనులు సుఖించెదరు.

**శ్లో॥ యదివిధి ధిష్ణ్యం పతతి తటస్థం శుభజలవృష్టిర్ధనకణవృద్ధిః !!**

రోహిణి సముద్రపు ఒడ్డున స్థానమందు వసించుట వలన సస్యవృద్ధి, తృణవృద్ధి, ధనవృద్ధి, పంటలు వృద్ధి చెందుట జరుగును.

## పాఠకులకు ముఖ్య గమనిక

**గత సంవత్సరం పంచాంగములో శాస్త్ర వాక్యప్రమాణములను అనుసరించి 26 పే.నెం.నుండి 31 వ పేజీ వరకూ ఫలితములు ఇవ్వడం జరిగినది.**

**శాస్త్రములో ప్రత్యక్ష వివరణ కంటే పరోక్ష వివరణయే ఉంటుంది, దానిని అనుసరించే ఫలితములు ఇవ్వడం జరిగినది అవి యథాతథముగా సమన్వయము అవుతున్నవి ఇది అంతయూ శాస్త్రము గొప్పతనమే !**

**అలాగే మరింతగా ఇప్పటి కాలానికి అనుగుణముగా ఫలితములు ఇవ్వడానికి ప్రయత్నిస్తానని తెలియపరుస్తూ అలాగే మానవతప్పిదములతో వచ్చే ప్రమాదములను దైవ అనుగ్రహము కూడా తప్పించలేదు కనుక చేతనైనంత వరకూ ఇతరులకు సహాయము చేయుట, ప్రకృతికి వ్యతిరేఖపనులు చేయకుండా ఉండటం వలన ప్రమాదములను తగ్గించుకోవచ్చును.**

**హాహాభూతాచ మేదినీ ! దుర్భిక్షం సర్వదేశేషు సంగ్రామం ఖండఖండయోః**

దక్షిణ, పశ్చిమప్రాంత ఫ్యాక్టరీలలో అగ్ని ప్రమాదములు ఏర్పడుట, పలు పెద్ద సంస్థలకు కేంద్ర ప్రభుత్వము నూతన జరీమానాలు విధించుట, నూతన రోగభయములు పెరుగుట, మతవాదములు ప్రబలుట, వైద్యపరమైన ఔషధములకు ధరలు పెరుగుట, రోగములు ప్రబలుట, పాలకులకు విరోధములేర్పడుట, ధాన్యాదుల ధరలు పెరుగుట, దేశవిరోధములు కలుగుట, సైనిక వర్గం వారికి మంచి అధికారములు, గుర్తింపులు వచ్చుట, అధికారులకు ప్రత్యర్థులతో వాదములు అధికమగుట, వాయుపరమైన ఇబ్బందులు ఏర్పడుట, బ్యాంక్ పన్నుశాతములు తగ్గును, వాయుపరమైన ఇబ్బందులు వాటిల్లుట, వెండి, బంగారం, లోహములకు, వస్త్రములకు, రబ్బర్ కి ధరలు పెరుగుట, రోగభయములేర్పడుట, దక్షిణాదిలో దొంగతనములు, రోగములు ఏర్పడుట జరుగును.

**ఇలా పరోక్షంగా యథాతథముగా సరిపోయే ఫలితములు చెప్పినా ప్రత్యక్షంగా కొరోనా అని తెలియపరచనందుకు పాఠకులు క్షమించగలరు, మరింత పరిశ్రమ చేసి రాబోవు ఫలితములను శాస్త్రవాక్యములకు భిన్నము కాకుండా అందించగలవాడను.**

విద్వత్కృపాభిలాషీ . సుబ్రహ్మణ్య సిద్ధాన్తి

# మకర సంక్రమణం



**స్వస్తిశ్రీ ప్లవ నామ సం॥ పౌష్య మాస శు॥ ౧౨ రోహిణి నక్షత్ర, బ్రాహ్మ్యం యోగ, బాలవకరణ యుక్త వృషభ లగ్నమందు**
**దివి. 14-01-2022 శుక్రవారం (౧౮-౮)**
**మ॥ 02-29 ని॥లకు శ్రీ సూర్య భగవానుడు**
**వ్యాఘ్ర వాహనారూఢుడై మకర రాశిలో ప్రవేశించుచున్నాడు.**

**ఉత్తరాయణ పుణ్యకాలం** 14-01-2022 న సంక్రమణ సమయము నుండి సాయంత్రం వరకూ

**ఫలం :-** మకర సంక్రమణ పురుషుడు **మిశ్ర** నామధేయుడగుటచే పశుసంపదకు ఇబ్బంది. శంఖోదకముచే స్నానం చేయుట వలన సుఖము, సౌఖ్యవస్తువులకు ధరలధికము అగును.

రక్తవస్త్రధారణ చేయుటచే రోగ ప్రదం, చందన గంధ లేపనం చేసుకోవడం చేత విప్రులకు నాశనం, జాజి పూలమాలను ధరించుటచే సుశోభనత్వం, ముత్యాలహారం ధరించుటచే అతిశుభదాయకం, రజిత పాత్ర చేత బూనుటచే సుభిక్షాకరం, పాయస భక్షణం చేయుటచే పశునాశనం, అరటి పండు చేత ధరించుటచే ఫలనాశనం, భిండివాలమను ఆయుధం ధరించుటచే అగ్నిభయం, వ్యాధి భయం, రక్తవర్ణ ఛత్రం ధరించుటచే యుద్ధప్రదం, పాలనా విషయములో ఆటంకములు, వ్యాఘ్ర వాహనురూఢుడగుటచే మృగ పశునాశనం, క్రోధ ముఖుడగుటచే అన్యోన్య వైరప్రదం, కూర్చుని ఉండుటచే కుల్మషములకు సరిణిలకు దూదికి బొబ్బర్లకు ఆనప కాకర ప్రియంగువులకు బొమ్మలకు మాలతీ పుష్పాదులకు పసుపు తెలుపు రంగు ధాన్యములకు చిత్రవస్త్రాదులకు సువర్ణానికి రాగికి గోధుమ మాష ధాన్యములకు వృద్ధి కల్గి మహార్ఘమును ఇచ్చును. దక్షిణ గమనుడు అగుటచే దక్షిణ దేశములకు నష్టము వాటిల్లును.

## రవిచారౌ ఆర్ద్రా ప్రవేశ కాలఫలమ్

**శ్రీప్లవ నామ సంవత్సరం జేష్ఠ శు॥ ౧౧ తత్కాల శు॥౧౨ సోమవారం దివి.21-06-21 న రా॥తె॥ 5-38-49 సె॥కు శ్రీ సూర్య భగవానుడు ఆర్ద్రా నక్షత్రములో ప్రవేశించుచున్నాడు.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| శు॥ ద్వాదశి | - | **శుభమ్** | బాలవ కరణం | - | **సుభిక్షం** |
| మంగళ వారం | - | **అనావృష్టిః** | మిథున లగ్నం | - | **వాయుపీడ** |
| విశాఖ నక్షత్రం | - | **రోగవృద్ధిః** | అరుణోదయం | - | **రోగవృద్ధిః** |
| సిద్ధం యోగం | - | **సుభిక్షం** | భరణీ మండలే | - | **అర్ఘనాశం** |

**అర్ధరాత్రి అనంతరం అరుణోదయకాలంలో అగుటవలన మంగళవారముగా తీసుకునుట జరిగినది. ఫలితములన్నింటినీ చూడగా సామాన్య వర్షములు వాయు జనిత ఇబ్బందులు కలిగే అవకాశములు కలవు.**

## గ్రహణం

ఈ సంవత్సరం మన తెలుగు రాష్ట్రాలలో కనిపించు గ్రహణములు ఏమియూ లేవు. **26-5-2021** సంపూర్ణచంద్రగ్రహణం ఉత్తర ఈశాన్య భారతదేశములలో (కలకత్త, మేఘాలయ, గౌహతి, త్రిపుర, నాగాలాండ్) ప్రాంతములలో మాత్రం కొన్ని నిమిషాలు కనిపించును.

భారతదేశములో కనిపించని గ్రహణములు **10-6-2021** న సూర్యగ్రహణం, **19-11-2021** న చంద్రగ్రహణం, **04-12-2021** న సూర్యగ్రహణములు. కనిపించని గ్రహణములకు నియమములు పాటించవలసిన అవసరము లేదు.

## కందాయ ఫలములు

| | అ | భ | కృ | రో | మృ | ఆ | పు | పుష్య | ఆశ్లే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమం | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 |
| ద్వితీయం | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| తృతీయం | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 |

| చి | స్వా | విశా | అనూ | జ్యే | ము | పూ.షా. | ఉ.షా. | శ్ర | ధ | శత | పూ.భా. | ఉ.భా. | రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 |

శ్లో॥ ఆదిశూన్యే మహా వ్యాధి ! మధ్య శూన్యే మనో వ్యథా !!
అంత్యశూన్యేర్థ నాశస్యాత్ ! త్రిశూన్యే నిష్ఫలం భవేత్ !!
విషమేష్వర్థ లాభస్యాత్ ! సమేతు సమతా భవేత్ !!
శూన్యేతు శూన్య మాప్నోతి ! కందాయ ఫలమీదృషం !!

మొదటి సున్నా ఉన్నచో మహా వ్యాధి(భయం), మధ్య సున్నాఉన్నచో మనో వ్యధ(ఋణాధికం) చివరి సున్నా ఉన్నచో ధనహాని, మూడు సున్నాలు ఉన్నచో అనేకమగు ఇబ్బందులు కలుగును. సరిసంఖ్య వచ్చిన సమమైన ఫలితము, బేసిసంఖ్య వచ్చినచో ధనలాభము కలుగును. (ఒక్కొక్క కందాయము నాలుగు మాసములు ఫలితము నిచ్చును.)

## ఆదాయ వ్యయములు

| రాశి | ఆదాయం | వ్యయం | రాజపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | 8 | 14 | 4 | 3 |
| వృషభం | 2 | 8 | 7 | 3 |
| మిధునం | 5 | 5 | 3 | 6 |
| కర్కాటకం | 14 | 2 | 6 | 6 |
| సింహం | 2 | 14 | 2 | 2 |
| కన్య | 5 | 5 | 5 | 2 |
| తుల | 2 | 8 | 1 | 5 |
| వృశ్చికం | 8 | 14 | 4 | 5 |
| ధనస్సు | 11 | 5 | 7 | 5 |
| మకరం | 14 | 14 | 3 | 1 |
| కుంభం | 14 | 14 | 6 | 1 |
| మీనం | 11 | 5 | 2 | 4 |

# శ్రీ ప్లవ నామ సం॥ వర్ష ధాన్యాదుల నిర్ణయము

| | |
|---|---|
| వర్షం - | 7 |
| ధాన్యం - | 5 |
| శీతం - | 5 |
| తృణం - | 13 |
| ఉష్ణం - | 17 |
| మరుతం - | 13 |
| ప్రజావృద్ధి - | 15 |
| తన్నాశం - | 15 |
| రాజత్వం - | 11 |
| ఉగ్రం - | 5 |
| పుణ్యం - | 5 |
| పాపం - | 5 |
| **వ్యాధి** - | 3 |
| ఉపశమనం - | 3 |
| ఆచారం - | 9 |
| అనాచారం - | 9 |
| జననం - | 7 |
| మరణం - | 7 |
| దేశోపప్లవం - | 13 |
| దేశస్వాస్థ్యం - | 11 |
| చోరభయం - | 3 |
| తన్నాశం - | 9 |
| అగ్నిభయం - | 15 |
| శాంతి - | 5 |
| మృగవృద్ధి - | 15 |
| మృగ దుర్భిక్షం | 13 |
| కీటకభయం - | 17 |
| తన్నాశం - | 11 |
| మూషకోద్భవం | 13 |
| తన్నాశం - | 7 |
| సర్పవృద్ధి - | 11 |
| తన్నాశం - | 9 |
| కామం - | 19 |
| లోభం - | 7 |
| మోహం - | 7 |
| మదం - | 3 |
| మాత్సర్యం - | 13 |
| సుఖం - | 3 |
| దుఃఖం - | 7 |
| భోగం - | 9 |
| విడంబం - | 9 |
| మనోవేదన - | 7 |
| ద్వేషం - | 3 |
| ప్రతిష్ఠ - | 15 |

| | |
|---|---|
| అప్రతిష్ఠ - | 9 |
| ద్యూతం - | 19 |
| మత్తత - | 11 |
| పురుషోత్పత్తి - | 19 |
| స్త్రీ ఉత్పత్తి - | 9 |
| ధాతువాదం - | 15 |
| భయం - | 3 |
| శౌర్యం - | 7 |
| దుష్టనిగ్రహం - | 11 |
| శిష్టపాలనం - | 15 |
| సత్యం - | 19 |
| అసత్యం - | 5 |
| విశ్వాసం - | 7 |
| అవిశ్వాసం - | 9 |
| దయ - | 11 |
| నిర్దయ - | 13 |
| న్యాయం - | 15 |
| అన్యాయం - | 17 |
| **సస్యవృద్ధి** - | 7 |
| తన్నాశం - | 8 |
| పశువృద్ధి - | 4 |
| తన్నాశం - | 7 |
| శుకవృద్ధి - | 7 |
| తన్నాశం - | 7 |
| ధృమవృద్ధి - | 8 |
| తన్నాశం - | 8 |
| **క్షుధ** - | 10 |
| తృష్ణ - | 6 |
| నిద్ర - | 6 |
| ఆలస్యం - | 10 |
| ఉద్యోగం - | 9 |
| శాంతం - | 10 |
| క్రోధం - | 9 |
| దంబం - | 5 |
| మిత్రభేదం - | 4 |
| ఇష్టత - | 10 |
| రసనిష్పత్తి - | 7 |
| ఫలనిష్పత్తి - | 9 |
| ఉత్సాహం - | 8 |
| **జ్ఞానం** - | 1 |
| అజ్ఞానం - | 1 |
| కపటం - | 7 |

| | |
|---|---|
| నిష్కపటం - | 15 |
| ధార్మికం - | 9 |
| అధార్మికం - | 3 |
| **గో వృద్ధి** - | 7 |
| తన్నాశం - | 10 |
| సస్యకీటవృద్ధి - | 7 |
| తన్నాశం - | 7 |
| శరభవృద్ధి - | 10 |
| తన్నాశం - | 1 |
| మశకవృద్ధి - | 1 |
| తన్నాశం - | 7 |
| మత్కుణవృద్ధి - | 4 |
| తన్నాశం - | 7 |
| వృశ్చికవృద్ధి - | 10 |
| తన్నాశం - | 10 |
| వ్యాఘ్రవృద్ధి - | 13 |
| తన్నాశం - | 10 |
| **పక్షివృద్ధి** - | 3 |
| తన్నాశం - | 3 |
| ధేనువృద్ధి - | 3 |
| తన్నాశం - | 4 |
| మహిషవృద్ధి - | 4 |
| తన్నాశం - | 4 |
| మృగవృద్ధి - | 5 |
| తన్నాశం - | 4 |
| ఖగవృద్ధి - | 4 |
| తన్నాశం - | 1 |
| అశ్వవృద్ధి - | 3 |
| తన్నాశం - | 3 |
| గజవృద్ధి - | 1 |
| తన్నాశం - | 1 |
| ఉష్ట్రవృద్ధి - | 2 |
| తన్నాశం - | 2 |
| విప్రవృద్ధి - | 3 |
| తన్నాశం - | 2 |
| క్షత్రియవృద్ధి - | 5 |
| తన్నాశం - | 4 |
| వైశ్యవృద్ధి - | 4 |
| తన్నాశం - | 1 |
| శూద్రవృద్ధి - | 5 |
| తన్నాశం - | 3 |
| మ్లేచ్ఛవృద్ధి - | 4 |
| తన్నాశం - | 4 |

| | |
|---|---|
| సంకరవృద్ధి - | 3 |
| తన్నాశం - | 1 |
| నవరత్నవృద్ధి - | 3 |
| తన్నాశం - | 5 |
| మరకతవృద్ధి - | 2 |
| మాణిక్యవృద్ధి - | 3 |
| వజ్రవృద్ధి - | 4 |
| వైఢూర్యవృద్ధి - | 5 |
| గోమేధికవృద్ధి - | 1 |
| పుష్యరాగవృద్ధి - | 1 |
| ఇన్ద్రనీలవృద్ధి - | 1 |
| ప్రవాళవృద్ధి - | 1 |
| మౌక్తికవృద్ధి - | 1 |
| ఇతరరత్నవృద్ధి - | 1 |
| **సువర్ణవృద్ధి** - | 0 |
| రజితవృద్ధి - | 0 |
| తామ్రవృద్ధి - | 0 |
| కాంస్యవృద్ధి - | 8 |
| లోహవృద్ధి - | 12 |
| అయస్కాంతవృద్ధి - | 8 |
| త్రపువృద్ధి - | 10 |
| సీసవృద్ధి - | 10 |
| రసవృద్ధి - | 6 |
| **వ్రీహివృద్ధి** - | 16 |
| శాలివృద్ధి - | 12 |
| కుళుత్థవృద్ధి - | 2 |
| తిలవృద్ధి - | 6 |
| మాషవృద్ధి - | 4 |
| ముద్గవృద్ధి - | 2 |
| సర్షపవృద్ధి - | 12 |
| చణకవృద్ధి - | 14 |
| ఆఢకవృద్ధి - | 14 |
| గోధుమవృద్ధి - | 12 |
| కోద్రవవృద్ధి - | 4 |
| ప్రియంగవవృద్ధి | 10 |
| యవవృద్ధి - | 12 |
| శ్యామావృద్ధి - | 6 |
| రాజమాషవృద్ధి | 14 |
| నీవారవృద్ధి - | 16 |
| శింబుధాన్యవృద్ధి | 12 |
| **పనసవృద్ధి** - | 1 |
| నారికేళవృద్ధి - | 1 |

| | |
|---|---|
| మాతువృద్ధి - | 19 |
| జంబీరవృద్ధి - | 16 |
| ఖర్జూరవృద్ధి - | 10 |
| రంభాఫలవృద్ధి | 19 |
| చూతఫలవృద్ధి - | 7 |
| కపిత్థవృద్ధి - | 19 |
| తింత్రిణీవృద్ధి - | 25 |
| ధాత్రీవృద్ధి - | 1 |
| **అతివృష్టి** - | 3 |
| అనావృష్టి - | 9 |
| మూషికవృద్ధి - | 9 |
| శలభవృద్ధి - | 7 |
| శుకవృద్ధి - | 3 |
| స్వచక్రవృద్ధి - | 13 |
| పరచక్రవృద్ధి - | 17 |
| **స్వప్న** - | 2 |
| సుషుప్తి - | 0 |
| జాగ్రత - | 0 |
| పైశూన్య - | 8 |
| క్రోధం - | 12 |
| జ్ఞానం - | 8 |
| అజ్ఞానం - | 10 |
| భుక్తి - | 10 |
| ధ్యానం - | 6 |
| **అండజవృద్ధి** - | 7 |
| తన్నాశం - | 5 |
| స్వేదజవృద్ధి - | 5 |
| తన్నాశం - | 13 |
| ఉద్భిజవృద్ధి - | 17 |
| తన్నాశం - | 13 |
| జరాయుజవృద్ధి | 15 |
| తన్నాశం - | 15 |
| స్థావరవృద్ధి - | 11 |
| తన్నాశం - | 5 |
| జంగమవృద్ధి - | 5 |
| తన్నాశం - | 5 |
| **విద్యుత్తు** - | 21 |
| శిలాపాతం - | 8 |
| గర్జితం - | 6 |



## కార్తెల చక్రం

| కార్తెపేరు | తేది | వారం | గం. - ని. | ఘటి -విఘ | వాహనం | ఫలం |
|---|---|---|---|---|---|---|
| అశ్విని | 13-Apr-21 | మంగళ | రా. 2-32 | ౫౧-౧౪ | నక్క | సువృష్టి |
| భరణి | 27-Apr-21 | మంగళ | సా. 6-24 | ౩౧-౧౫ | దున్న | అల్పవృష్టి |
| కృత్తిక | 11-May-21 | మంగళ | మ. 12-34 | ౧౬-౫౮ | గుఱ్ఱం | సుభిక్షం |
| రోహిణి | 25-May-21 | మంగళ | ఉ. 8-46 | ౭-౩౮ | మేక | నిర్జలం |
| మృగశిర | 08-Jun-21 | మంగళ | ఉ. 6-41 | ౨-౨౬ | ఏనుగు | సుభిక్షం |
| ఆర్ద్రా | 21-Jun-21 | సోమ | రా.తె.5-39 | ౫౯-౪౭ | నక్క | సువృష్టి |
| పునర్వసు | 05-Jul-21 | సోమ | రా.తె.5-16 | ౫౮-౪౨ | నెమలి | మహావాయువు |
| పుష్యమి | 19-Jul-21 | సోమ | రా.తె.4-45 | ౫౭-౧౧ | ఎలుక | పర్వత వృష్టి |
| ఆశ్రేష | 02-Aug-21 | సోమ | రా.తె.3-42 | ౫౪-౨౩ | దున్న | అల్పవృష్టి |
| మఖ | 16-Aug-21 | సోమ | రా. 1-17 | ౪౮-౧౨ | ఏనుగు | సుభిక్షం |
| పుబ్బ | 30-Aug-21 | సోమ | రా. 9-20 | ౩౮-౧౩ | కప్ప | సువృష్టి |
| ఉత్తర | 13-Sep-21 | సోమ | మ. 3-06 | ౨౨-౩౪ | గాడిద | అల్పవృష్టి |
| హస్త | 27-Sep-21 | సోమ | ఉ. 6-42 | ౧-౨౭ | ఎలుక | పర్వత వృష్టి |
| చిత్త | 10-Oct-21 | ఆది | రా. 7-37 | ౩౩-౪౧ | దున్న | అల్పవృష్టి |
| స్వాతి | 23-Oct-21 | శని | రా.తె.6-12 | ౬౦-౦౦ | ఏనుగు | సుభిక్షం |
| విశాఖ | 06-Nov-21 | శని | మ. 2-20 | ౨౦-౦౫ | నక్క | సువృష్టి |
| అనూరాధ | 19-Nov-21 | శుక్ర | రా. 8-25 | ౩౫-౦౧ | దున్న | అల్పవృష్టి |
| జ్యేష్ఠ | 02-Dec-21 | గురు | రా. 12-45 | ౪౫-౩౩ | ఏనుగు | సుభిక్షం |
| మూల | 15-Dec-21 | బుధ | రా.తె.3-44 | ౫౨-౪౨ | నక్క | సువృష్టి |

ఇందలి పండుగల నిర్ణయములు, మౌఢ్య, పుష్కర, సంక్రమణ, గ్రహసంచార, గ్రహణ, నిర్ణయములన్నియూ శ్రీ కంచికామకోటిపీఠ జగద్గురువుల సమక్షంలో లాక్‌డౌన్ కారణంగా ఆన్‌లైన్ జూమ్ యాప్ ద్వారా జరిగిన పంచాంగ దక్షిణభారతదేశ పంచాంగ పండిత సదస్సులో పండితులచే, జగద్గురువులచే ఆమోదించబడినవి.

విద్వత్కృపాభిలాషి. కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, తెలుగు దృగ్గణితపంచాంగకర్తల సమాఖ్య అధ్యక్షులు

"జ్యోతిష కేసరి" "జ్యోతిష చతురానన" "దైవజ్ఞ శిరోరత్న" "జ్యోతిషశాస్త్ర విద్వన్మణి"

**బ్ర॥శ్రీ॥ దైవజ్ఞ లక్కావఝ్ఝల సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**

**E-mail:** lssiddhanthy@gmail.com, lssiddhanthy.blogspot.com

**9963732303, 9550017546, 9866839560.**

# ధర్మసిన్ధు సమ్మత చైత్రపక్ష దృగ్గణితం
# 14-01-2022 ననే సంక్రాన్తి పండుగ

పంచాంగములలో పండగలలో భేదములకు మూలకారణం అయనాంశములు, ఈ అయనాంశములలో ఏది సరి అయినదో ఆవిధానమును అనుసరించవలయును.

**యథావతత్తత్తత్సంక్రాంతిషు దానాదికం కర్తవ్యం తథైవతాభ్యః పుర్వమయనాంశ ప్రవృత్తౌతత్తత్సంక్రాంత్యుచితస్నానదానాదికం కర్తవ్యం । అయనాంశా జ్యోతిశ్శాస్త్రేప్రసిద్ధాః తేచేదానీం ద్వాదశాధిక సప్తదశ శతసంఖ్యాకే శాలివాహనశకే ఏకవింశతిరయనాంశాః । ఇత్యేకవింశతితమేదినే పూర్వమయనాంశ పర్వకాల ఇతిపర్యవసన్నోర్థః । ఏవం న్యూనాధిక శకే ఊహ్యామ్ ॥ ధర్మసిన్ధు మూలం సంక్రాన్తి ప్రకరణం**

ఈ పై వివరం మనమందరం పరమ ప్రామాణికంగా ఆచరించే ధర్మసిన్ధులో ప్రతిపాదించిన అయనాంశ వివరం, ఇందులో ఏ అయనాంశను ప్రతిపాదించాయో పరిశీలిద్దాం. **ద్వాదశాధిక సప్తదశ శతసంఖ్యాకే శాలివాహనశకే ఏకవింశతిరయనాంశాః** అనగా శాలివాహన శకం 1712 కల్యాది 4891 ఆంగ్లవత్సరం 1790 లో అయనాంశలు 21 గా ఉన్నట్టు నిరయన ప్రవేశమునకు 21 రోజులముందు సాయన సంక్రమణం జరుగుతుంది అని తెలిపినారు, ఇలా ఈ అయనాంశ సంవత్సరానికి 50.27 సెకండ్లతో ముందుకువెళుతూ 72 సంవత్సరాలకు 1డిగ్రీ పెరుగుతూ ఉంటుంది.

అప్పటి శాలివాహనశకం 1712 కల్యాది 4891 ఆంగ్లవత్సరం 1790 లో 21 అయనాంశలకు ఎవరివి దగ్గరగా ఉన్నవో పరిశీలిద్దాం.

**పూర్వపద్ధతిరీత్యా** **$19^0$-21'-39"** **తేడా డిగ్రీన్నర తేడా ఉంది**

**చైత్రపక్ష దృగ్గణితపద్ధతిరీత్యా** **$20^0$-55'-30"** **21 డిగ్రీలకు చాలాదగ్గరగా ఉంది**

ధర్మశాస్త్రాలలో ప్రతిపాదించిన 21 అయనాంశలకు దగ్గరగా చైత్రపక్షమే కలదు అలాగే త్రిభువన వల్లభ చక్రవర్తులు 11వందల శతాబ్దములో సంక్రమణ పర్వ గ్రహణ గణిత వివరములతో కూడిన గణిత శాసనములో కూడా చైత్రపక్షమే సరిపోయినది.

72 సంవత్సరాలకు 1డిగ్రీ పెరుగుతూ ఉంటుంది. కనుక ఇప్పటికి 3 డిగ్రీలు పెరిగి ప్రసుత ప్లవ సంవత్సరమునకు పూర్వపద్ధతి రీత్యా **$22^0$-49'-48"**
**చైత్రపక్ష దృగ్గణితపద్ధతిరీత్యా $24^0$-9'-36"** అనగా ప్రస్తుతకాలంలో సాయన సంక్రమణం నుండి 24 రోజులకు నిరయణ సంక్రమణం జరుగుతుంది.

ఆ ప్రకారం అవాస్తవమైన అయనాంశములను విడిచి శాస్త్రీయమైన, ధర్మశాస్త్ర ప్రతిపాదితమైన దృగ్గణితరీత్యా సరిపోవు చైత్రపక్షరీత్యా స్వస్తిశ్రీ ప్లవ నామ సం॥ **పౌష్య మాస శు॥ ౧౨ దివి.14-01-2022 శుక్రవారం (౧౮-౭) ము॥ 02-29 ని॥లకు శ్రీ సూర్య భగవానుడు వ్యాఘ్ర వాహనారూఢుడై మకర రాశిలో ప్రవేశించుచున్నాడు.** ఇదియే సరి అయిన సమయం. **కనుక 13-01-2022 భోగి, 14-01-2022 సంక్రాన్తి, 15-01-2022 కనుమ ఆచరించవలయును.** ఇదియే శాస్త్రసమ్మతం, ఇతర పూర్వపద్ధతి పంచాంగ గణితములు అసత్యము, ఆచరణయోగ్యము కానివి. **సుబ్రహ్మణ్య సిద్ధాన్తి.**

# వేద ప్రతిపాదిత దృగ్గణితమ్

మన భారతదేశమందు సూర్యసిద్ధాన్త ఆధారిత సిద్ధాంత పంచాంగములు, ఆర్యభటీయవిధానాది తంత్ర గ్రంథ ఆధార పంచాంగములు, గ్రహలాఘవాది అధునీకరణ చేసిన కరణ గ్రంథ ఆధార పంచాంగములు, వందేళ్ల క్రితం రచించిన జ్యోతిర్గణిత ఆధారితమైన నవీన దృక్సిద్ధపంచాంగములు స్వాతంత్ర్య అనంతరము నుండీ అన్నిరాష్ట్రములకూ కలిపి 14 భాషలలో రాష్ట్రీయ పంచాంగము అనుపేరుతో కేంద్రప్రభుత్వ ఆమేద పంచాంగములు ప్రజాబాహుళ్యములో కలవు. అయితే ఈ రకరకముల పంచాంగములలో తిథ్యాది పంచాంగములు, రవిచంద్రాది గ్రహస్థితులు ఒకదానికి మరొకటి పోలిక లేకుండా భిన్నభిన్నముగా ఉన్నాయి. అటువంటి ఇబ్బంది వలన సంక్రాన్తి, యుగాది, వ్రతాదిపర్వకాల, ఏకాదశ్యాది అనేక విషయములలో ఏకీకృత స్థితి లేక ఏది సత్యమో తేలలేక ఆస్తికప్రజానీకము అనేక సందేహములను పొందుతున్నది. మరి ఏది ప్రస్తుతకాలానికి సత్యమైనది, ఏది ప్రస్తుతకాలానికి అప్రస్తుతమైనది అనువిచారము చేయవలసి ఉన్నది.

వరాహమిహిరుల వారు కూడా పూర్వాచార్య సిద్ధాంత మత భేదములను బాగుగా విచారించి సూక్ష్మమైన బీజసంస్కార విశేషములు కలిగి దృగ్గణితైక్య గణిత విధానము తెలుసుకోవడానికి వేధ చేసినారు. ఇదే విషయమును **సూర్యసిద్ధాంత గ్రంధములో కూడా తత్తద్గతి వశాన్నిత్యం యథా దృక్తుల్యతాం గ్రహాః। ప్రయాన్తి తత్ప్రవక్ష్యామి స్ఫుటీకరణ మాదరాత్ ॥** ఇక్కడ "తత్తద్గతి వశాన్నిత్యం" అనుటచేత ఎల్లప్పుడూ దృక్సిద్ధియే ఉండవలయును, ఎప్పుడు దృక్సిద్ధి సరిపడదో అప్పుడు గ్రంథోక్త విషయములను దృక్తుల్యమగునట్లు చేసుకోవలయునని అదియే సరైనపక్షమని వైదిక ప్రామాణికత కలిగిన విధంగా మహర్షివచనములు కలవు.

ఇదే విషయమును నృసింహసౌరభాష్యకారులు **"వేదమూల ఏవాయం పక్షః"** అని తెలిపిరి. ఏదైతే వేదప్రమాణముగా వేదసమ్మతమై ఉన్నదో అట్టి శృతికి అనుకూలముగానే బీజమును దృక్ ని సర్వులూ గ్రహించిరి. ఇక్కడ సూక్ష్మముగా పరిశీలించిన ఈ బీజసంస్కరణ విషయమై ఎట్టి భేదమూ కనిపించదు. అటులనే **"అర్థోదితే సూర్య ఆహవనీయమాదధాతి । ఏతస్మిన్నేవ లోకే ప్రజాపతిః ప్రజా అసృజత । ప్రజా ఏవ తద్యజమానః సృజతే । అథో భూతం చైవ భవిష్యం చావరుంధే ॥"** (తైత్తిరీయబ్రాహ్మణే ప్రథమాష్టకే)

అర్థోదితసూర్య సాధన సూక్ష్మగణనవలననే సాధ్యమగుతుంది, స్థూల గణనరీత్యా సాధ్యముకాదు, స్థూలగణన రీత్యా రమారమి 5నిమిషములకంటే అధిక వ్యత్యాసం వస్తుంది. కావున సూక్ష్మగణితమును సాధించుటకు తప్పనిసరిగా దృక్సిద్ధము చేయవలసినదే. అటులనే వరాహపురాణాంతర్గత చాతుర్మాస్య ప్రకరణంలో కూడా

**"స్పష్టం పురా వేదచక్షుః జ్యోతిశ్శాస్త్రం మయాద్భుతం ..... ఉదయాస్తౌ గ్రహాణాం స్యుః గ్రహణం చంద్రసూర్యయోః ... తిథిమాసాద్యకుర్వీత నాన్యథా తు కథంచన ॥"** ("ఉదయాస్తౌ గ్రహాణాం స్యుః" ఇక్కడ ఉదయాస్తశబ్దము గ్రహముల మరియూ గ్రహణములయొక్క ఉదయాస్తకాలవిషయమై) గ్రహణమౌఢ్యాదుల కాలనిర్ణయవిషయమై ఎంతనిక్కచ్చితముగా గణించాలో ఎంతసూక్ష్మత్వముతో చెప్పాలో తెలుపుతున్నది.

అలాగే ధర్మశాస్త్రాదులలో యజ్ఞాదులకు ఎంతనిక్కచ్చితముగా కాలగణనచేయాలో అనేవిషయములను తెలిపియున్నారు, నిత్యసంధ్యోపాసనాది ఆచరణ విషయాదులలో కూడా గ్రహాదుల సూక్ష్మత్వ గణిత విషయమును ధృవీకరిస్తు..... **"అర్ధాస్తమితే సూర్యే వ్యక్తీభూతా న తారకా యావత్ తావత్ సాయం సంధ్యా ప్రాతఃసంధ్యా తు తారాణాం .. భానోరబదయో యావత్ ॥" ఇతి ॥** అని ప్రత్యక్ష నిదర్శనము ఉండవలయునని ప్రతిపాదించారు.

అలాగే వేదాంగజ్యోతిషంలో దర్శపూర్ణమాసాదులనిమిత్తమై సూక్ష్మతిథ్యాది ప్రాధాన్యమును తెలుపు అంశములు **"వేదా హి యజ్ఞార్థమనుప్రవృత్తాః కాలానుపూర్వ్యా విహితాశ్చ యజ్ఞాః తస్మాదిదం కాలవిధానశాస్త్ర యో జ్యోతిషం వేద స వేద వేదం ॥"** యస్య హవిర్నిరుప్తం....... **"చంద్రమా అభ్యుదేతి ॥ శ్రుతిషు కుహ్వామేవ శ్రాద్ధం కార్య, న తు సినీవాల్యాం ఇతి ॥ "సా దృష్టేందుః సినీవాలీ సా నష్టేందుకలా కుహూః" ఇత్యమరః ॥** కేనచిత్ గణితేన ఇయం కుహూః ఇతి నిర్ణీయ ఇష్టిః క్రియేత చేత్ యది తద్దినే చంద్రస్య క్షీణకలాయాం దృష్టాయాం వ్యాహతీర్హత్వా బ్రహ్మాదండం దద్యాత్ । సైషా ప్రత్యక్షి ప్తిః ॥ **వర్జనీయేఽహ్ని హోమశ్చేత్ వారుణ్యాం యది దృశ్యతే । తత్ర వ్యాహృతిభిర్హుత్వా దండం దద్యాద్విజాతయే**
చతర్దశీసంబంధాత్ చంద్రదర్శనవతీ సినీవాలీ । తస్యాం నేష్టిః కార్యా । కహ్వామేవ సిద్ధాంతః । బీజసంస్కారాద్యభావే అద్యతనత్వే ఇదమసాధ్యమేవ । **"చతుర్దశ్యష్టమే భాగే క్షీణో భవతి చంద్రమాః । అమావాస్యాష్టమే భాగే పునః కిల భవేదణుః ॥"** దృగ్గణిత ఆవశ్యకతను ధృవీకరించే ఇత్యాది అనేక వైదికశాస్త్ర విషయాలు అనేకము కలవు.
**వానరస్య తృతీయేఽశే నాతిసంధ్యానమీపతః । యదా చతుర్దశీయామం తురీయమనుపూరయేత్ ॥ అమావాస్యా క్షీయమాణా తదైవ శ్రాద్ధమిష్యతే । యదుక్తం యదహస్త్వేవ దర్శనం నైతి చంద్రమాః ॥ అమావాస్యాష్టమాంశే చ పునః కిల భవేదణుః । అన్యోందురాద్యే ప్రహరేవ తిష్ఠేత్ చతుర్థభాగోఽపి కలావశిష్టః తదంత ఏవ క్షయమేతి కృత్స్నం ఏవం జ్యోతిశ్చక్రవిదో వదంతి ॥** (గోభిలస్మృతి)
**దృక్సిద్ధైస్తైరిహపర్వధర్మనయసత్కార్యాదికం త్వాదిశేత్ ॥** ఇటువంటి ప్రమాణాలన్నింటినీ పరిశీలించగా ధర్మశాస్త్రకారులైన మనపూర్వులందరూ కూడా మనందరమూ చేసేటటువంటి జపహోమ శ్రాద్ధ వ్రతాదులను వాటిద్వారా సరైన ఫలితములు రావడం కోసం దైవజ్ఞులద్వారా ప్రత్యక్షప్రమాణమైన దృక్తుల్యము చేయబడిన తిథిని బాగుగా తెలుసుకొని తద్వారా కార్యములను ఆచరించవలయునని తెలిపియున్నారు. **జాతకగోళనిమిత్తప్రశ్నముహూర్తాఖ్యగణితనామాని । అభిదధతీహ షడంగాన్యాచార్యా జ్యౌతిషే మహాశాస్త్రే ॥** జ్యోతిషశాస్త్రాన్తర్గతమైన గోళ, ప్రశ్నా, జాతకాదులన్నింటినీ ప్రత్యక్షప్రమాణమైన దృక్సిద్ధివలననే ప్రపంచములోని జ్యోతిర్విదులు అందరూ విజయము పొందుతున్నారు.
**మాందం కర్మైకమర్కేన్ద్వోః కుర్యాత్తిథ్యాదిసాధనే । చతస్ర ఉదయాస్తాదౌ గ్రహణే పంచసంస్క్రియాః ॥ ఇతి కేచిత్ ॥** కానీ పై ప్రమాణము శృత్యాదులలో చెప్పబడిన ప్రమాణములకు విరుద్ధముగా ఉన్నది, దృక్సిద్ధముకాని గ్రహములు స్థూల గ్రహములు ఇవి కర్మార్హములు కావు, ఇక కేవలం మందఫలసంస్కారముచేత పూర్వంలో దృక్సిద్ధిని పొంది ప్రత్యక్షఫలితములు కనపించేవి గ్రహసాధనలో, కేవలం అట్టి మందఫల సంస్కారము తప్పడము వలననే కదా తరువాత శాస్త్రకారులందరూ వాటియందు బీజమును కలుపుతూ వచ్చారు, కావున దృక్సిద్ధమైన గ్రహములే దృక్సిద్ధమైన తిథులే సర్వదా ఆచరణయోగ్యము అనే విషయమును గుర్తించాలి. అలాగే కావ్యాదులలో కూడా స్ఫుట గ్రహసాధన విషయై మన పూర్వులు ప్రతిపాదించారు, (స్ఫుట శబ్దమునకు స్పష్టమైన ప్రతక్షమైన, వ్యక్తమైన, వికసితమైన అని అర్థములుకలవు. నైషధం, కుమారసంభవం, మాఘకావ్యం కిరాతార్జునీయం, ఇత్యాది అనేక కావ్యాలలో ప్రత్యక్ష గ్రహసాధన ప్రాధాన్య విషయము ప్రతిపాదించారు )
**యాత్రావివాహోత్సవజాతకాదౌ ఖేటైః స్ఫుటైరేవ ఫలస్ఫుటత్వం ।**
**స్యాత్ ప్రోచ్యతే తేన నభశ్చరాణాం స్ఫుటక్రియా దృగ్గణితై కకృద్యా ॥** భాస్కరాచార్యాః ।
అలాగే వివాహాది సర్వశుభకార్యక్రమ విశేషాలకు కూడా దృక్సిద్ధతిథ్యాదులనే గ్రహించవలయును, అదేవిధముగా షణ్ణవతీ శ్రాద్ధవిషయాదులలోకూడా సత్కర్మఫలితము

పొందుటకు దృక్సిద్ధగ్రహములనే తీసుకోవలయునని శృతి ప్రమాణము కానీ దానికి విరుద్ధముగా దృక్సిద్ధమును కాదనుట మన అవివేకము అగుతుంది, ఏలయనగా
**ప్రత్యక్షాద్యవిసంవాది జ్ఞానేనైవ యథార్థతా । అనుభూతివిరోధే తు న ప్రమా భవతి క్వచిత్ ॥**
జ్యోతిశ్శాస్త్రం ప్రయోగాత్మకమైన విజ్ఞాన శాస్త్రం అటువంటి ప్రయోగాత్మక విజ్ఞాన శాస్త్రమునకు ప్రత్యక్షతయే ప్రమాణము, అట్టి ప్రత్యక్షత సిద్ధివలననే ప్రయోగము ఫలించును కావున ప్రత్యక్షసిద్ధికై దృక్సిద్ధమును గ్రహించాలి అని స్పష్టమవుతున్నది.
**దృక్సిద్ధఖేటగ్రహసాధితాసు కుర్వంతి కే చిత్ తిథిషు ప్రమాదాత్ ।**
**శ్రాద్ధాదికం తత్పితృశాపతస్తే పుణ్యక్షయం దుర్గతిమాప్నువంతి ॥** ఇత్యాది స్కాంద వచనములు దృక్సిద్ధమైన తిథులు పనికిరావు అనే ప్రమాణములు చూపుతున్నారు కానీ సౌరపురాణంలో **అనిర్ణీతాసు తిథిషు న కించిత్ కర్మ సిద్ధ్యతి । జ్ఞాత్వైవ సూర్యచంద్రాభ్యాం తిథిస్ఫుటతరం వ్రతీ ॥** ప్రత్యక్ష విరుద్ధమైన తిథుల వలన సర్వకర్మలూ వైఫల్యమును పొందును అని తెలిపి ఉన్నారు, ఇంకొంచెం లోతుగా పరిశీలిస్తే "వ్రతీ స్ఫుటతరం తిథిం జ్ఞాత్వా" "విశేషేణ రతత్వం వ్రతత్వం – తద్వాన్ వ్రతీ" వ్రతీ అనగా ప్రత్యక్షనిరీక్షణతత్పరులు అని అర్థం, అలాగే స్ఫుటతరం అనగా సూక్ష్మగణనచే తిథిని సాధించుటకు ప్రత్యక్షనిరీక్షణయందు ఇష్టత కలిగినవాడై తద్వారా తిథ్యాదులను తెలుసుకుని వాటిద్వారా కర్మలను ఆచరించాలని లేనిచో కర్మఫలితములు రావని సుస్పష్టముగా ఇంతలోతుగా చెప్పబడిఉన్నది ఇదే అంశమును, నారద, అగ్ని, వాయు, మత్స్య, విష్ణుపురాణాలలో కూడా చెప్పుట వలన దృక్సిద్ధ తిథులే కర్మార్హములు, మరి స్కాందోక్తి మాటఏమిటి అనగా దృక్సిద్ధ గర్భీయతిథులు, దృక్సిద్ధపృష్ఠీయతిథి విషయము, గర్భీయతిథులలోనే ఆచరించాలి తప్ప పృష్ఠీయతిథులలో ఆచరించకూడదని కాదు ఆవిషయమును సవిస్తరముగా పరిశీలిద్దాం. **అతః కుమధ్యాద్గత ఖార్ధసూత్రే దృక్తుల్యతామేతి నభశ్చరోయః । మ ఏవ శుద్ధః పరమార్థతస్స్యాత్ ॥** బీజోపనయ వ్యాఖ్య ॥ ఈ రెండు తిథులు దృక్సిద్ధము పొంది ఉండవలయును. ఇందులో దృక్సిద్ధ భూపృష్ఠీయ తిథులు నిత్య శ్రాద్ధాది కర్మలకు అర్హమైనవి కావని, దృక్సిద్ధ భూగర్భీయతిథులు కర్మార్హములని తెలుపబడినది. అంతే కానీ **దృక్సిద్ధ తిథులు కర్మార్హము కావని కాదు**. నత కర్మ అని ప్రత్యేకముగా చెప్పబడినది, ఈ నత సంస్కారమును గ్రహణ దినములలో చేయుట వలన భూపృష్ఠీయ తిథి అంత్య సమయము వచ్చును. ఈ భూపృష్ఠీయ తిథి అంత్య సమయమే (భూపృష్ఠీయ పర్వాంతకాలమే) గ్రహణ మధ్యకాలమగును. కావున నిత్యవ్యవహార తిథి యందు ఈ నత సంస్కారము చేయకుండా తీసుకోవాలి తప్ప దృక్సిద్ధము చేయకూడదని కాదు. ఇంకా ప్రత్యేకించి అయన దృక్కర్మ, అక్షదృక్కర్మ, లంబనాది సంస్కారాదులు గ్రహణ సందర్భములో, ఉదయాస్తమయములయందు చేయదగినవి, నిత్యవ్యవహార తిథి యందు కాదు, అంతే కానీ దృక్సిద్ధము చేయని తిథిని వాడమని కాదు, కావున పై గ్రంధ ప్రమాణము వలన భూగర్భీయ తిథులు, భూపృష్ఠీయ తిథులు రెండూ దృక్సిద్ధమై ఉండవలయును. తిథి నిర్ణయ కారిక గ్రంథకర్త పైశ్లోకములో లంబనాక్షాది దృక్కర్మ...తిథి శ్రాద్ధం నచాచారేత్ . అనుటవలన లంబనాక్షాది సంస్కారములు నత సంస్కారములు చేసిన భూపృష్ఠీయ తిథిశ్రాద్ధాదులకు పనికిరాదు అని...భచక్రనాభి దృక్సిద్ధే కుర్యాత్ శ్రాద్ధ వ్రతాదికం. అని అనుట వలన నతకర్మలు చేయకుండా చరసంస్కారాదులు చేసిన దృక్సిద్ధ రవి చంద్రులచే సాధించిన దృక్సిద్ధ భూగర్భీయ తిథులే కర్మార్హములు అని సుస్పష్టంగా తెలుస్తున్నది. కావున పై సూక్ష్మ పరిశీలన ఆధారముగా అలాగే మిగిలిన పురాణముల ఆధారముగా అర్థాన్ని మార్చి చెబుతున్న స్కాందోక్తిని విడిచిపెట్టవలయునని స్పష్టమగుచున్నది.

**కర్మణఃశాస్త్రసాంగత్యం బలాబలవినిర్ణయః ।** ధర్మశాస్త్రజ్ఞానప్రయోజన ముఖ్య ఉద్దేశము పరస్పర విరుద్ధమైన అంశములలో ఏదిసత్యమో అనే బలాబలములను తేల్చి

చెప్పుటయే, లోకములో కూడా కోర్ట్, హైకోర్ట్, సుప్రీంకోర్ట్ అని అనేకవిధములుగా కలవు, వాటిలో అన్నింటికంటే ఉన్నతమైన సుప్రీంకోర్టు నిర్ణయాన్ని ఉల్లంఘించడానికి ఎవరికీ అధికారము లేదుకదా, అందరూ ఆమోదిస్తారు కదా అలాగే శాస్త్రములో కూడా **శ్రుతిస్మృతిపురాణేషు విరుద్ధేషు పరస్పరమ్ । పూర్వం పూర్వం బలీయః స్యాత్ ఇతి న్యాయవిదో విదుః ॥** శృతి స్మృతి పురాణాలలో ఏదైనా అంశములో విభిన్న వచనములు ఉన్నప్పుడు ఒకదానికంటే మరొకటి బలము అగును పురాణము కంటే స్మృతి కంటే శృతి బలీయమైనది అని నిర్ణయము చేసినారు ఇదే విషయమును స్పష్టముగా శ్రీమతాచార్యులవారు కూడా వారి మాటలలో **శ్రుతిరేవ బలీయసీ, వేదాః నిత్యత్వాన్మానముత్తమమ్** అని వేద ప్రమాణమే పరమ ప్రామాణికమని మనందరికీ మార్గనిర్దేశనము చేసినారు. **యస్య హవిర్నిరుప్తం** ఇత్యాది వైదిక వచనముల ఆధారములవలన ఇష్టి మొదలగు కార్యములు చేయురోజున ప్రత్యక్షంలో చంద్రకళ దర్శనమిస్తే ప్రాయశ్చిత్తములు చేయవలయుననిచెప్పిరి అట్టిదోషమురాకుండా ముందుగానే జాగ్రత్తపడి ప్రత్యక్ష తిథిని (దృక్సిద్ధతిథిని) సాధించుకోవలయునని వేదప్రమాణముగా కనబడుతున్నది. అలాగే **వారుణీ యది దృశ్యతే** ఇత్యాది స్మృతి వచనములు కూడా శ్రాద్ధాది కార్యములకు ధర్మశాస్త్రములలో చెప్పబడినట్లుగా దృగ్గణితతిథ్యాదులవలననే ఆచరించవలయునని బోధపడుతున్నది, అన్నింటికీ ఆధారభూతమైన వేదమే ప్రామాణికముగా **దృగ్గణితైనైవ కార్యాణి** అనితెలిపి ఉన్నది, కావున అట్టి వేదప్రమాణమును అందరూ శిరోధార్యముగా స్వీకరించవలయునుకదా! **మన్వాదౌ చ యుగాదౌ చ గ్రహణే చంద్రసూర్యయోః । వ్యతీపాతే చ వైధృత్యాం తత్కాలవ్యాపినీ తిథిః ॥** పై పై ప్రమాణమును బట్టీ గ్రహణ శ్రాద్ధాదులకు కావలసిన తిథికై ఒక గణితము, మన్వాది శ్రాద్ధాదులకు మరొక గణితమును చేయవలయునని ఎక్కడా చెప్పలేదు, తిథ్యాది విషయంలో ఒకప్పుడు ఒకరకంగా తిథిని సాధించవలయును మరొక అప్పుడు మరొక గణితము అనే విధానమే అశాస్త్రీయము అని తేలుతున్నది సర్వవేళలా దృక్సిద్ధము చేసిన తిథినే స్వీకరించవలయును అని స్పష్టమగుతున్నది. **పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః । వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ ॥** అదేవిధముగా మనువుకూడా దృగ్గణిత ప్రాధాన్యమును, మరియూ వైదికకర్మలన్నింటికీ కర్మార్హమగు దృక్సిద్ధమైన పంచాంగ గణనయే శ్రేష్ఠమని తెలిపినారు. వైదికైః కర్మభిః పుణ్యైః నిషేకాదిర్ద్విజన్మనామ్ । కార్యః శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ ॥ నిషేకాది సర్వేఽపి సంస్కారాః శ్రాద్ధాదీని పైతృకకర్మాణి చ వేదోక్తాన్యేవేతి స్పష్టమ్ ।
**కర్మార్హపంచాంగసమత్వసిద్ధ్యై స్ఫుటక్రియా దృగ్గణితైకకృద్యా ।** పై ప్రమాణముల వలన లోకమున చేయుకర్మలు పరిపూర్ణఫలితములు ఇచ్చుటకు దృగ్గణిత తిథ్యాదులనే స్వీకరించవలయునని సర్వ మహర్షులు, అష్టాదశ ప్రవర్తకులైన సూర్యాది సిద్ధాన్తగ్రంథకర్తలు అందరూ వారివారి కాలములలో వారి వారి గ్రంథములలో ప్రత్యక్షవేధచేసి మరీ తెలిపినారు, కావున అయన–ఋతు–మాస–పక్ష–గ్రహ–అనధ్యాయతిథి–సంక్రమణాదులు అలాగే నక్షత్ర, యోగ కరణములు స్పష్టరవిచంద్రాదులను దృక్సిద్ధముచేసుకుని స్వీకరించవలయునని స్పష్టమగుచున్నది.

భారత ప్రభుత్వము (Indian Government) ప్రముఖ జ్యోతిష పండితులను ఒకమండలిగా చేసి ప్రభుత్వాధీనఅధికారరంగముతో రాష్ట్రీయపంచాంగమను పేరుతో 14 భాషలలో భారతదేశములో కల సర్వ దేవాలయ ఆగమములకు భిన్నముకలుగకుండా మతసాంప్రదాయములకు భిన్నము కలుగకుండా భారతదేశములో కల సర్వ పర్వములతో కూడుకుని ప్రత్యక్ష దృక్సిద్ధమైన పంచాంగమును ప్రచురిస్తూ ఉన్నది. అట్టి విధానము సర్వులకూ ఆచరణీయయ యోగ్యమైనది అని నిక్కచ్చితముగా తెలియపరుస్తున్నాను.

**॥ సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ ॥ యల్. సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**

# శ్రీ ప్లవ నామ సం॥ పండుగల నిర్ణయం

**చైత్రం**

**ఎప్రిల్-2021**

13.యుగాది, వత్సరారంభం
13.వసన్త నవరాత్రారంభం
13.చంద్రదర్శనం
13.నక్షత్రమానాబ్దం
13.మేషసంక్రమణం
14.తమిళ వత్సరాది
15.ఉత్తమ మన్వాది
17.లక్ష్మీపంచమి, నాగారాధన
17.కూర్మకల్పాది
17.మత్స్యజయన్తి
18.రమణ మహర్షి జయన్తి
20.భవాన్యుత్పత్తి
20.అశోకాష్టమి
21.శ్రీరామనవమి,శ్రీరామజయన్తి
22.ధర్మ దశమి
23.సర్వేషాం చైత్ర శు॥౧౧
23.వాడపల్లి తీర్థం
25.మహావీర జయన్తి
26.రౌచ్యక మన్వాదిః
27.శ్రీహనుమద్విజయోత్సవం
30.సంకష్టహర చతుర్థి

**మే-2021**

**04. శుక్రమౌఢ్యమి సమాప్తం**
04.వాస్తుకర్తరి ప్రారంభం
07.సర్వేషాం చైత్ర బ॥ ౧౧
09.మాసశివరాత్రి
11.నిజ కర్తరి ప్రారంభం

**వైశాఖం**

**మే-2021**

13.చంద్రదర్శనం
14.త్రేతాయుగాది
14.పరశురామ జయంతి
14.అక్షయ తృతీయ
17.శ్రీ శంకరాచార్య జయన్తి
22స్మార్తానాం వైశాఖ శు॥౧౧
23.మధ్వవైష్ణవానాం వైశాఖ శు॥ ౧౧
25.నృసింహజయన్తి
26.బుద్ధ పూర్ణిమ
28.పార్థివ కల్పాది
28.వాస్తుకర్తరి త్యాగం
29.సంకష్టహర చతుర్థి

**జూన్-2021**

04.శ్రీహనుమజ్జయన్తి
06.మతత్రయ వైశాఖ బ॥ ౧౧
08.మాస శివరాత్రి

**జ్యేష్ఠం**

**జూన్-2021**

12.చంద్రదర్శనం
12.బుద్ధ జయన్తి
21.మతత్రయ జ్యేష్ఠ శు॥ ౧౧
21.కూర్మ జయన్తి
24.భౌత్యక మన్వాది
24.ఏరువాకపౌర్ణిమ,వృషభపూజ
27.సంకష్టహర చతుర్థి

**జులై-2021**

05.సర్వేషాం జ్యేష్ఠ బ॥ ౧౧
08.మాస శివరాత్రి
09.వటసావిత్రీ వ్రతం

**ఆషాఢం**

**జులై-2021**

11.చంద్రదర్శనం
15.స్కంద పంచమి,కుమారషష్ఠి
16.కర్కాటక సంక్రమణం
16.దక్షిణాయనం పుణ్యకాలం
19.లక్ష్మీ వ్రతారంభం
19.చాక్షుష మన్వాది
19.చాతుర్మాస్యవ్రతారంభం
20.సర్వేషాం ఆషాఢ శు॥ ౧౧
20.తొలి ఏకాదశి
24.యతీనాంచాతుర్మాస్యవ్రతారంభం
24.వ్యాసపౌర్ణిమ,గురుపౌర్ణిమ
27.సంకష్టహర చతుర్థి
31.రుద్రసావర్ణిక మన్వాది

**అగస్ట్-2021**

02. ఆడి కృత్తిక
04.మతత్రయ ఆషాఢ బ॥౧౧
06.మాస శివరాత్రి
08.చుక్కల అమావాస్య

**శ్రావణం**

**అగస్ట్-2021**

10.చంద్రదర్శనం
13.గరుడ పంచమి
14.సూర్య షష్ఠి వ్రతం
15.భారత స్వాతంత్ర్య దినోత్సవం
18.సర్వేషాం శ్రావణ శు॥౧౧
20.వరలక్ష్మీ వ్రతం
21.వరాహ జయన్తి
21.ఋగ్వేదోపాకర్మ
22.యజుర్వేదోపాకర్మ
22.రాఖీపౌర్ణమి
22.శ్రీ హయగ్రీవోత్పత్తి
22.విఖనస జయన్తి
22. సర్పబలి
22. సంస్కృత దివసః
25.సంకష్టహర చతుర్థి
30.శ్రీకృష్ణాష్టమి, శ్రీజయన్తి
31. వైష్ణవ శ్రీకృష్ణ జయన్తి

**సెప్టెంబర్-2021**

03.మతత్రయ శ్రావణ బ॥౧౧
05.మాస శివరాత్రి
06.అగ్నిసావర్ణిక మన్వాది
06.పొలాల అమావాస్య

**భాద్రపదం**

**సెప్టెంబర్-2021**

08.చంద్రదర్శనం
09.బలరామ జయన్తి
09.తామస మన్వాది
09.సామవేదోపాకర్మ
10.వినాయక చవితి
11.ఋషి పంచమి
17.మతత్రయ భాద్రపద శు॥౧౧
17.వామన జయన్తి
19.అనన్త చతుర్దశి
20.విశ్వరూప యాత్ర
21.మహాలయ పక్షారంభం
23.ఉండ్రాళ్ళతద్ది
24.సంకష్టహర చతుర్థి
24.భరణీ మహాలయం
29.సూర్య సావర్ణిక మన్వాది

# శ్రీ ప్లవ నామ సం॥ పండుగల నిర్ణయం

**అక్టోబర్-2021**
02.సర్వేషాం భాద్రపద బ॥౧౧
03.యతీనాం మహాలయం
04.కలియుగాది
04.మాస శివరాత్రి
05.విషశస్త్రహతజనానాంమహాలయం
06.మహాలయ అమావాస్య

**ఆశ్వీయుజం**
**అక్టోబర్-2021**
7.శ్రీదేవీ శరన్నవరాత్రారంభం
07.చంద్రదర్శనం
10.లలితా పంచమి
11.శ్రీసరస్వతీదేవి పూజ
12.త్రిరాత్రకలశస్థాపనం
13.దుర్గాష్టమి
14.మహార్నవమి,సార్వోచిష మన్వాది
**15.విజయదశమి (దసరాపండుగ)**
16.సర్వేషాం ఆశ్వీయుజ శు॥౧౧
20.శరత్పౌర్ణిమ
23.అట్లతద్ది
24.సంకష్టహర చతుర్థి

**నవంబర్-2021**
01.మతత్రయ ఆశ్వీయుజ బ॥౧౧
03.నరకచతుర్థశి
03.మాస శివరాత్రి
04.దీపావళి, ధనలక్ష్మీపూజలు,
04.కేదార వ్రతములు.

**కార్తీకం**
**నవంబర్-2021**
05.బలిపాడ్యమి
06.యమద్వితీయ, భగినీ హస్త భోజనం
06.చంద్రదర్శనం
08.నాగులచవితి, వల్మీక పూజ
12.కృత యుగాది
15.మతత్రయ కార్తీక శు॥౧౧
15.స్వాయంభువ మన్వాది
16.చిల్కుద్వాదశి, క్షీరాబ్ది ద్వాదశి
16.తులసీకృష్ణ వివాహం
17.వైకుంఠ చతుర్దశి
19.కార్తీక పౌర్ణమి
19.దక్షసావర్ణిక మన్వాది
21.**సింధూ నదికి పుష్కరములు ప్రారంభం**
23.సంకష్టహర చతుర్థి
26.సావిత్ర కల్పాది
27.ఇంద్రసావర్ణిక మన్వాది
30.సర్వేషాం కార్తీక బ॥౧౧

**డిసెంబర్-2021**
02.మాస శివరాత్రి

**మార్గశిరం**
**డిసెంబర్-2021**
05.చంద్రదర్శనం
09.సుబ్రహ్మణ్య షష్ఠి
12.ప్రళయ కల్పాది
14.సర్వేషాం మార్గశిర శు॥౧౧
14.గీతాజయన్తి,వైకుంఠఏకాదశి
18.శ్రీ దత్తాత్రేయ జయన్తి
20. శివముక్కోటి, ఆర్ద్రోత్సవం
22.సంకష్టహర చతుర్థి
30.సర్వేషాం మార్గశిర బ॥౧౧

**జనవరి-2022**
01.ఆంగ్లవత్సరాది
01.మాస శివరాత్రి

**పౌష్యం**
**జనవరి-2022**
04.చంద్రదర్శనం
**04. శుక్రమౌఢ్యమి ప్రారంభం**
13.రైవత మన్వాది
13.భోగి పండుగ
13.సర్వేషాం పౌష్యశు॥౧౧
**13.శుక్రమౌఢ్యమి సమాప్తం**
14.మకర సంక్రమణం
14.సంక్రాన్తి పండుగ
14.ఉత్తరాయణ ప్రారంభం
15.కనుమ పండుగ
21.సంకష్టహర చతుర్థి
23.త్యాగరాజస్వామిఆరాధన
26.గణతంత్ర దినోత్సవం
28.సర్వేషాం పౌష్యబ॥౧౧
30.మాస శివరాత్రి

**మాఘం**
**ఫిబ్రవరి-2022**
02.చంద్రదర్శనం
05.వసంత పంచమి
07.వైవస్వత మన్వాది
07.రథసప్తమి
08.భీష్మాష్టమి
09.మధ్వ నవమి
12.సర్వేషాంమాఘశు॥౧౧,
12.భీష్మైకాదశి
13.భీష్మ ద్వాదశి
14.వరాహ కల్పాది
**19. గురుమౌఢ్యమిప్రారంభం**
20.సంకష్టహర చతుర్థి
26.స్మార్తానాంమాఘబ॥౧౧
27.మధ్వవైష్ణవానాం మాఘబ॥౧౧

**మార్చి-2022**
01.మహా శివరాత్రి
01.మాస శివరాత్రి
02.ద్వాపర యుగాది

**ఫాల్గుణం**
**మార్చి-2022**
04.చంద్రదర్శనం
14.మతత్రయ ఫాల్గుణ శు॥౧౧
16.ద.భారత ప్రా.కామదహనం
17.ఉ.భారత ప్రా.కామదహనం
17.హోళికోత్సవం
17.బ్రహ్మసావర్ణిక మన్వాది
18. హోళీపండుగ మతాంతరం
19.వసంతోత్సవం
20.బ్రహ్మకల్పాది
**20. గురుమౌఢ్యమి సమాప్తం**
21.సంకష్టహర చతుర్థి
28.సర్వేషాం ఫాల్గుణ బ॥౧౧
30.మాసశివరాత్రి

**ఏప్రిల్-2022**
02.శ్రీ శుభకృత్ సంవత్సర యుగాది
02.చంద్రదర్శనం

## అలభ్య యోగములు

| భాను సప్తమి | భౌమ చతుర్థి | అంగారక చతుర్దశి | శ్రవణేకాదశి | భార్గవరాకా యోగం |
|---|---|---|---|---|
| 02-05-21 | 13-07-21 | 25-05-21 | 17-09-21 | 23-07-21 |
| 15-08-21 | 27-07-21 | 19-10-21 | 28-03-22 | 19-11-21 |
| 29-08-21 | 23-11-21 | 15-02-22 | **గురువారైకాదశి** | 18-03-22 |
| 26-12-21 | 07-12-21 | **బుధాష్టమి** | 06-05-21 | **శని త్రయోదశి** |
| 09-01-22 | 22-03-22 | 19-05-21 | 02-09-21 | 24-04-21 |
| 08-05-22 | 05-04-22 | 02-06-21 | 16-09-21 | 04-09-21 |
| **అమాసోమవారం** | **కృష్ణాంగారకచతుర్దశి** | 29-09-21 | 30-12-21 | 18-09-21 |
| 06-09-21 | 05-10-21 | 13-10-21 | 13-01-22 | 01-01-22 |
| 31-01-22 | 01-03-22 | 26-01-22 | | 15-01-22 |
| | | 09-02-22 | | |

| హస్తాదిత్య | భౌమాశ్విని | రవిపుష్య | భృగురేవతి | సోమ మృగ ఋక్ష |
|---|---|---|---|---|
| 28-03-21 | 13-04-21 | 11-07-21 | 02-07-21 | 27-09-21 |
| 25-04-21 | 16-11-21 | 08-08-21 | 30-07-21 | 25-10-21 |
| 23-05-21 | 14-12-21 | **బుధానురాధ** | 01-04-22 | 22-11-21 |
| 23-01-22 | 11-01-22 | 28-04-21 | 29-04-22 | **పాతార్క యోగం** |
| 20-02-22 | **గురుపుష్య** | 26-05-21 | **శనిరోహిణీ** | 08-08-21 |
| **సోమ శ్రావణి** | 28-10-21 | 23-06-21 | 20-11-21 | 12-12-21 |
| 03-05-21 | 25-11-21 | 23-02-22 | 18-12-21 | 27-02-22 |
| 31-05-21 | | 23-03-22 | | |
| 28-02-22 | | | | |
| 28-03-22 | | | | |

## మన్వాదులు - కల్పాదులు

| | | | |
|---|---|---|---|
| శ్వేతవరాహ కల్పాది | 13-Apr-21 | బలరామ జయంతి | 9-Sep-21 |
| ఉత్తమ మన్వాది | 15-Apr-21 | తామస మన్వాది | 9-Sep-21 |
| కూర్మ కల్పాది | 17-Apr-21 | వామన జయంతి | 17-Sep-21 |
| మత్స్య జయంతి | 17-Apr-21 | సూర్యసావర్ణికా మన్వాది | 29-Sep-21 |
| శ్రీరామ జయంతి | 21-Apr-21 | కలియుగాది | 4-Oct-21 |
| రౌచ్యక మన్వాది | 26-Apr-21 | స్వారోచిష మన్వాది | 14-Oct-21 |
| త్రేతాయుగాది | 14-May-21 | కృతయుగాది | 12-Nov-21 |
| పరశురామ జయంతి | 14-May-21 | స్వాయంభువ మన్వాది | 15-Nov-21 |
| నృసింహ జయంతి | 25-May-21 | దక్షసావర్ణిక మన్వాది | 19-Nov-21 |
| పార్థివ కల్పాది | 28-May-21 | సావిత్ర కల్పాది | 26-Nov-21 |
| హనుమజ్జయంతి | 4-Jun-21 | ఇంద్రసావర్ణిక మన్వాది | 27-Nov-21 |
| బుద్ధజయంతి | 12-Jun-21 | ప్రళయ కల్పాది | 12-Dec-21 |
| కూర్మ జయంతి | 21-Jun-21 | రైవత మన్వాది | 13-Jan-22 |
| భౌత్యక మన్వాది | 24-Jun-21 | వైవస్వత మన్వాది | 7-Feb-22 |
| చాక్షుష మన్వాది | 19-Jul-21 | వరాహ కల్పాది | 14-Feb-22 |
| రుద్రసావర్ణిక మన్వాది | 31-Jul-21 | ద్వాపర యుగాది | 2-Mar-22 |
| వరాహ జయంతి | 21-Aug-21 | బ్రహ్మ సావర్ణిక మన్వాది | 17-Mar-22 |
| శ్రీకృష్ణ జయంతి | 30-Aug-21 | బ్రహ్మ కల్పాది | 20-Mar-22 |
| అగ్నిసావర్ణిక మన్వాది | 6-Sep-21 | | |

## సౌర సంచార రీత్యా, గ్రహసంచార పండుగల నిర్ణయం

| | |
|---|---|
| మేషసంక్రమణం | 13-Apr-21 |
| తమిళ వత్సరాది | 14-Apr-21 |
| వృషభాయనగో రవి | 19-Apr-21 |
| వాస్తుకర్తరి ప్రారంభం | 4-May-21 |
| నిజ కర్తరి ప్రారంభం | 11-May-21 |
| వృషభసంక్రమణం | 14-May-21 |
| మిథునాయనగో రవి | 20-May-21 |
| వాస్తుకర్తరి త్యాగం | 28-May-21 |
| మిథున సంక్రమణం | 15-Jun-21 |
| కర్కాటకాయనగో రవి | 21-Jun-21 |
| కర్కాటక సంక్రమణం | 16-Jul-21 |
| దక్షిణాయన పుణ్యకాలం | 16-Jul-21 |
| సింహాయనగో రవి | 22-Jul-21 |
| ఆడి కృత్తిక | 2-Aug-21 |
| భారత స్వాతంత్ర్యదినోత్సవం | 15-Aug-21 |
| సింహ సంక్రమణం | 16-Aug-21 |
| కన్యాయనగో రవి | 22-Aug-21 |
| శ్రీకణ్ణన్ తిరు నక్షత్రం | 31-Aug-21 |
| కన్య సంక్రమణం | 16-Sep-21 |
| తులాయనగో రవి | 22-Sep-21 |
| తుల సంక్రమణం | 17-Oct-21 |
| వృశ్చికాయనగో రవి | 23-Oct-21 |
| వృశ్చిక సంక్రమణం | 16-Nov-21 |
| కృత్తికాదీపోత్సవం | 19-Nov-21 |
| ధనురాయనగో రవి | 22-Nov-21 |
| ధనుస్సంక్రమణం | 15-Dec-21 |
| మకరాయనగో రవి | 21-Dec-21 |
| ఆంగ్ల వత్సరాది | 1-Jan-22 |
| భోగి పండుగ | 13-Jan-22 |
| మకర సంక్రమణం | 14-Jan-22 |
| ఉత్తరాయణ పుణ్యకాలం | 14-Jan-22 |
| సంక్రాంతి పండుగ | 14-Jan-22 |
| కనుమ పండుగ | 15-Jan-22 |
| కుంభాయనగో రవి | 20-Jan-22 |
| గణతంత్ర దినోత్సవం | 26-Jan-22 |
| కుంభ సంక్రమణం | 12-Feb-22 |
| మీనాయనగో రవి | 18-Feb-22 |
| మీన సంక్రమణం | 14-Mar-22 |
| మేషాయనగో రవి | 20-Mar-22 |
| మేష సంక్రమణం | 14-Apr-22 |

| | |
|---|---|
| కుజ మౌఢ్యమి ప్రారంభం | 17-Aug-21 |
| కుజ మౌఢ్యమి సమాప్తం | 29-Nov-21 |
| బుద మౌఢ్యమి ప్రారంభం | 5-Apr-21 |
| బుధ మౌఢ్యమి సమాప్తం | 1-May-21 |
| బుద మౌఢ్యమి ప్రారంభం | 2-Jun-21 |
| బుధ మౌఢ్యమి సమాప్తం | 19-Jun-21 |
| బుద మౌఢ్యమి ప్రారంభం | 20-Jul-21 |
| బుధ మౌఢ్యమి సమాప్తం | 16-Aug-21 |
| బుద మౌఢ్యమి ప్రారంభం | 4-Oct-21 |
| బుధ మౌఢ్యమి సమాప్తం | 16-Oct-21 |
| బుద మౌఢ్యమి ప్రారంభం | 5-Nov-21 |
| బుధ మౌఢ్యమి సమాప్తం | 24-Dec-21 |
| బుద మౌఢ్యమి ప్రారంభం | 17-Jan-22 |
| బుధ మౌఢ్యమి సమాప్తం | 29-Jan-22 |
| బుద మౌఢ్యమి ప్రారంభం | 18-Mar-22 |
| బుధ మౌఢ్యమి సమాప్తం | 16-Apr-22 |
| **గురుమౌఢ్యమి ప్రారంభం** | 19-Feb-22 |
| **గురుమౌఢ్యమి సమాప్తం** | 20-Mar-22 |
| **శుక్రమౌఢ్యమి ప్రారంభం** | 13-Feb-21 |
| **శుక్రమౌఢ్యమి సమాప్తం** | 4-May-21 |
| **శుక్రమౌఢ్యమి ప్రారంభం** | 4-Jan-22 |
| **శుక్రమౌఢ్యమి సమాప్తం** | 13-Jan-22 |
| **శుక్రమౌఢ్యమి ప్రారంభం** | 14-Sep-22 |
| **శుక్రమౌఢ్యమి సమాప్తం** | 2-Dec-22 |
| శని మౌఢ్యమి ప్రారంభం | 19-Jan-22 |
| శని మౌఢ్యమి సమాప్తం | 21-Feb-22 |
| **సింధూ నదికి పుష్కరములు ప్రారంభం** | **21-Nov-21** |



# శ్రీ కాంచి కామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు ఆరాధనా తిథి నిర్ణయం

జగద్గురువుల పేరు చివర ఇంద్ర సరస్వతీ మహాస్వామి వారు అని చదవగలరు

| | | | |
|---|---|---|---|
| **15** గంగాధరః ౧, | 12-Apr-21 | **20** మూకశంకరః | 22-Aug-21 |
| **27** చిద్విలాసః, | 12-Apr-21 | **21** చంద్రచూడః ౧ | 30-Aug-21 |
| **52** శంకరానందః | 12-Apr-21 | **24** చిత్సుఖః ౧ | 31-Aug-21 |
| **43** ఆనందఘనః | 21-Apr-21 | **59** బోధః ౨ | 20-Sep-21 |
| **60** అద్వైతాత్మప్రకాశః | 28-Apr-21 | **33** సచ్చిదానందఘనః ౨ | 27-Sep-21 |
| **56** సదాశివబోధః | 3-May-21 | **44** పూర్ణబోధః ౨ | 4-Oct-21 |
| **47** చంద్రశేఖరః ౩ | 11-May-21 | **45** పరమశివః ౧ | 12-Oct-21 |
| **40** మహాదేవః ౨ | 17-May-21 | **19** విద్యాఘనః ౨ | 14-Oct-21 |
| **26** ప్రజ్ఞాఘనః | 19-May-21 | **36** చిత్సుఖానందః | 20-Oct-21 |
| **1** ఆదిశంకరభగవత్పాదః | 22-May-21 | **22** పరిపూర్ణబోధః | 12-Nov-21 |
| **39** సచ్చిద్విలాసః | 25-May-21 | గోవిందభగవత్పాదః | 18-Nov-21 |
| **30** బోధః ౧ | 29-May-21 | **64** చంద్రశేఖరః ౫ | 20-Nov-21 |
| **7** ఆనందజ్ఞానః | 3-Jun-21 | **9** కృపాశంకరః | 22-Nov-21 |
| **3** సర్వజ్ఞాత్మా | 9-Jun-21 | **42** బ్రహ్మానందఘనః౨, | 27-Nov-21 |
| **6** శుద్ధానందః, | 16-Jun-21 | **49** మహాదేవః౩, | 27-Nov-21 |
| **50** చంద్రచూడః ౨ | 16-Jun-21 | **58** ఆత్మబోధః | 27-Nov-21 |
| **23** సచ్చిత్సుఖః | 17-Jun-21 | **28** మహాదేవః ౧ | 29-Nov-21 |
| **16** ఉజ్జ్వలశంకరః | 18-Jun-21 | **18** సురః | 4-Dec-21 |
| **61** మహాదేవః ౫ | 19-Jun-21 | **32** చిదానందఘనః | 9-Dec-21 |
| **17** సదాశివః ౧, | 20-Jun-21 | **5** జ్ఞానానందః | 10-Dec-21 |
| **53** సదాశివః ౨ | 20-Jun-21 | **13** సచ్చిద్ఘనః | 19-Dec-21 |
| **2** సురేశ్వరాచార్యః | 21-Jun-21 | **4** సత్యబోధః | 27-Dec-21 |
| **25** సచ్చిదానందఘనః ౧ | 19-Jul-21 | **68** చంద్రశేఖరః ౮ | 30-Dec-21 |
| **35** చిత్సుఖః ౨ | 15-Jul-21 | **14** విద్యాఘనః ౧, | 2-Jan-22 |
| **12** చంద్రశేఖరః ౧ | 18-Jul-21 | **34** చంద్రశేఖరః ౨ | 2-Jan-22 |
| **48** అద్వైతానందబోధః | 19-Jul-21 | **55** చంద్రచూడః ౩ | 13-Jan-22 |
| **31** బ్రహ్మానందఘనః ౧, | 21-Jul-21 | **8** కైవల్యానందః | 16-Jan-22 |
| **63** మహాదేవః ౬ | 21-Jul-21 | **37** విద్యాఘనః ౩, | 19-Jan-22 |
| **10** విశ్వరూపసురః | 23-Jul-21 | **62** చంద్రశేఖరః ౪ | 19-Jan-22 |
| **54** మహాదేవః ౪ | 24-Jul-21 | **11** చిద్ఘనః | 10-Feb-22 |
| **38** ధీరశంకరః, | 8-Aug-21 | **51** విద్యాతీర్థః | 17-Feb-22 |
| **46** సాంద్రానందబోధః | 8-Aug-21 | **66** చంద్రశేఖరః ౬ | 24-Feb-22 |
| **41** గంగాధరః ౨ | 9-Aug-21 | **67** మహాదేవః ౭ | 3-Mar-22 |
| **57** పరమశివః ౨ | 17-Aug-21 | **69** శ్రీజయేంద్రసరస్వతీ | 15-Mar-22 |
| **29** పూర్ణబోధః ౧ | 18-Aug-21 | **65** మహాదేవః ౮ | 31-Mar-22 |

## శ్రీ కాంచి కామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు జయన్తీ నిర్ణయం

| | |
|---|---|
| శ్రీ కాంచికామకోటి సర్వజ్ఞ పీఠ ప్రతిష్ఠాపన జయన్తీ | 26-May-21 |
| శ్రీ కాంచికామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామీనాం జయన్తీ | 26-May-21 |
| శ్రీ కాంచికామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు శ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ మహాస్వామీనాం పీఠారోహణ జయన్తీ | 28-May-21 |
| యతీనాం చాతుర్మాస్య వ్రతారంభం | 24-Jul-21 |
| శ్రీ కాంచికామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు శ్రీ జయేంద్ర సరస్వతీ మహాస్వామీనాం జయన్తీ | 26-Jul-21 |
| యతీనాం చాతుర్మాస్య వ్రత సమాపనం, విశ్వరూప యాత్ర | 20-Sep-21 |
| శ్రీ కాంచికామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామీనాం ఆరాధన | 30-Dec-21 |
| శ్రీ కాంచికామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు శ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ మహాస్వామీనాం జయన్తీ | 27-Feb-22 |
| శ్రీ కాంచికామకోటి సర్వజ్ఞ పీఠ జగద్గురు శ్రీ జయేంద్ర సరస్వతీ మహాస్వామీనాం ఆరాధన | 16-Mar-22 |

## శ్రీ మధ్వ పుణ్యతిథి నిర్ణయం

| తీర్థంకర నామములు | ఇంగ్లీషుతేది | తీర్థంకర నామములు | ఇంగ్లీషుతేది |
|---|---|---|---|
| వేదవ్యాస తీర్థంకర పుణ్యతిథి | 14.04.21 | సత్యపరాక్రమ తీర్థంకరతిథి | 13.10.21 |
| కవీంద్ర తీర్థంకర పుణ్యతిథి | 21.04.21 | సత్యవర తీర్థంకర పుణ్యతిథి | 13.11.21 |
| సత్యప్రియ తీర్థంకర పుణ్యతిథి | 25.04.21 | వేదనిధి తీర్థంకర పుణ్యతిథి | 14.11.21 |
| వాగీశ తీర్థంకర పుణ్యతిథి | 29.04.21 | విద్యానిధితీర్థంకర పుణ్యతిథి | 23.11.21 |
| సత్యవిజయ తీర్థంకర పుణ్యతిథి | 09.05.21 | పద్మనాభ తీర్థంకర పుణ్యతిథి | 03.12.21 |
| విద్యాధిరాజ తీర్థంకర పుణ్యతిథి | 14.05.21 | సత్యనిధి తీర్థంకర పుణ్యతిథి | 13.12.21 |
| శ్రీరామచంద్ర తీర్థంకర పుణ్యతిథి | 17.05.21 | సత్యనాధ తీర్థంకర పుణ్యతిథి | 15.12.21 |
| సత్యసంధ తీర్థంకర పుణ్యతిథి | 12.06.21 | రఘునాథతీర్థంకర పుణ్యతిథి | 30.12.21 |
| సత్యాభినవ తీర్థంకర పుణ్యతిథి | 23.06.21 | రఘూత్తమతీర్థంకర పుణ్యతిథి | 14.01.22 |
| సత్యపూర్ణ తీర్థంకర పుణ్యతిథి | 26.06.21 | సత్యకాయ తీర్థంకర పుణ్యతిథి | 23.01.22 |
| రఘువర్య తీర్థంకర పుణ్యతిథి | 27.06.21 | నరహరి తీర్థంకర పుణ్యతిథి | 24.01.22 |
| సత్యాధిరాజ తీర్థంకర పుణ్యతిథి | 18.07.21 | విద్యాధీశతీర్థంకర పుణ్యతిథి | 31.01.22 |
| శ్రీ జయ తీర్థంకర పుణ్యతిథి | 28.07.21 | పురందర దాసర్ తీ.పు. | 31.01.22 |
| సత్యాధీశ తీర్థంకర పుణ్యతిథి | 08.08.21 | మధ్వనవమి తీర్థంకర తిథి | 09.02.22 |
| సత్యవర తీర్థంకర పుణ్యతిథి | 14.08.21 | సత్యబోధ తీర్థంకర పుణ్యతిథి | 04.03.22 |
| రాఘవేంద్ర తీర్థంకర పుణ్యతిథి | 24.08.21 | వదిరాజస్వామిగళ తీ.పు. | 05.03.22 |
| సత్యేష్ఠ తీర్థంకర పుణ్యతిథి | 16.09.21 | వ్యాసరాయగళ్ తీ.పు. | 06.03.22 |
| మాధవ తీర్థంకర పుణ్యతిథి | 07.10.21 | సత్యవ్రత తీర్థంకర పుణ్యతిథి | 08.03.22 |
| సత్యపరాయణ తీర్థంకర తిథి | 12.10.21 | | |

